# సంకష్టహార చతుర్దీ

# శ్రీ మహాగణపతి వ్రతము



# సంకట హర చతుర్థీ
# శ్రీమహాగణపతి వ్రతము

వ్యాఖ్యాతలు :
శ్రీ పుచ్చా శ్రీనివాసరావు
శ్రీ ఆదిపూడి వేంకట శివసాయిరామ్



ప్రకాశకులు : ☎ 246 2565(0883)



మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1.

 2015 వెల : 30.00
www.mohanpublications.com
www.granthanidhi.com

# సంకటహర చతుర్థీ
# శ్రీమహాగణపతి వ్రతము

2015



ఈ వ్రతపుస్తములు
7 ప్రతులకు140-00రూ॥లు
21ప్రతులుకావలసినవారు
420-00రూ॥లు
ఎం.వో ద్వారా పంపిన
పోస్టులేక కొరియర్‌లో
పంపగలము.

గ్రంథకర్తలు :

శ్రీ పుచ్చా శ్రీనివాసరావు

డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్

ప్రకాశకులు

**మోహన్ పబ్లికేషన్స్**

కోట గుమ్మం - రాజమండ్రి - 533 101

google play store / mohan publications

facebook Like us to follow /Mohanpublications



## శ్రీ సంకటహరచతుర్థి
## శ్రీమహాగణపతి ధ్యానము

బాలార్కారుణ కాంతిర్యాయే బాలాం మహన్నంకే ।
లసదిం దీవర హస్తాం గౌరాంగీం రత్న శోభాడ్యామ్ ।
దక్షేఽ ఙ్కుశ వరదానం వామే పాశం చ పాయసం పాత్రమ్।
నీలాంశుకర సమానః పీఠే పద్మారుణీ తిష్ఠన్ ॥
సంకట హరణః పాయత్ సంకట పూజాద్గజాననో నిత్యః॥

1. కలౌ చండీ వినాయకా

కలియుగంలో వెంటనే అనుగ్రహించే దేవతలు దుర్గ మరియు గణపతులు మాత్రమే అని శాస్త్రవచనం.

2. శ్రీగణేశుని సంబంధించిన ఉపాసన, సాధన, మంత్ర, తంత్ర విధానాలు, సాహిత్యం అన్ని 'గాణపత్యం' అనే పేరుతో ప్రసిద్ధమయినవి.

# సంకష్టహర చతుర్థి శ్రీమహాగణపతి వ్రతమాహాత్మ్యము

గణపతిని పూజించకుండా ఏ కార్యమూ తలపెట్టము. అక్షరగణ పాలకుడూ, వేద పురోహితుడూ, అభీష్ట సిద్ధి ప్రదాయకుడూ, విఘ్నములను పారద్రోలే ప్రణవ స్వరూపుడూ ఈ మహాగణపతి.

అవ్యక్త, వ్యక్త స్వరూపుడు, సమస్త విద్యలకు నిధి, మనోవాంఛిత ప్రదాయకుడు, దేవతల అధినేతగా కొలవబడేవాడు ఈ షడానన అగ్రజుడు.

మన సకల అభీష్ఠములను నెరవేర్చుకొనుటకు వివిధ దేవతలను ఆరాధిస్తాము. కొలుస్తాము. అయితే ఏ దేవతని ఆరాధించాలన్నా మొదట ఈ మోదక ప్రియుడైన గణపతిని తప్పనిసరిగా పూజించాలి.

**'చతుర్థీపూజన ప్రీతః'**

చతుర్థీ (చవితి) తిథి గోపతికి ఎంతో ప్రీతిపాత్రమైనది. కారణం–ఆ తిథినాడే ఆయన ఉద్భవించాడు కనుక. ఈ పరంగా స్వామియొక్క అనుగ్రహాన్ని పొందటానికి ఆచరించే వాటిలో ముఖ్యమైనది సంకష్టహర చతుర్థీ శ్రీ మహాగణపతి వ్రతం.

ప్రతి మాసంలోనూ కృష్ణపక్షంలో వచ్చే చతుర్థినాడు, చంద్రోదయముతో చవితి తిథి ఉండే రోజున ఈ వ్రతమును ఆచరించాలి. ప్రథమంగా పరమేశ్వరుని ఆజ్ఞతో పార్వతీదేవి ఈ వ్రతాన్ని ఆచరించి అద్భుత ఫలితాన్ని పొందినట్లు పురాణం. అగస్త్య మహర్షి సప్తసముద్రాలను ఆపోశనం పట్టడానికి గల శక్తినిచ్చింది ఈ వ్రతమే. దమయంతికి దూరం అయిన తన భర్త నలచక్రవర్తిని ఈ వ్రతాన్ని ఆచరించి దగ్గర చేసుకుంది.

రుక్మిణీదేవి తన కుమారుడైన ప్రద్యుమ్నుడు దూరమవటంలో దుఃఖితురాలై లోమశ మునిని ఆశ్రయించి, అర్ఘ్యపాద్యములతో పూజించి అలవిశక్యంకాని తన బాధను విన్నవించుకుంది.

ఆమె వ్యధను గమనించి లోమశముని రుక్మిణీదేవికి సంకష్ట చతుర్థీ శ్రీ మహాగణపతివ్రతంయొక్క మహాత్మ్యాన్ని చెప్పి ఆచరించవలసిందిగా చెప్పాడు. వ్రతమాచరించిన రుక్మిణీదేవి తన పుత్రవియోగాన్ని ఎడబాసింది.

శ్రీకృష్ణుని కుమారుడైన అనిరుద్ధుడు బాణాసురుని చెఱలో బంధింపబడగా ఈ వ్రతప్రభావంచేత ఆ రాక్షసుని సంహరించి ఆమె కుమార్తెను వివాహమాడాడు.

కార్తవీర్యార్జునుడు గాలిని మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ మహాగణపతిని గూర్చి పన్నెండు సంవత్సరాల పాటు మహోత్కృష్టమైన తపస్సుచేయగా గణనాధుడు ప్రత్యక్షమై వరము కోరుకోమనగా కార్తవీర్యార్జునుడు 'రక్తవర్ణ దాయకా.' 'అభీష్టప్రదాయకా' నిరంతరం నీపైనే నాకు అనన్యమైనభక్తి ఉండే విధంగా వరమును ప్రసాదించమని ప్రార్థించాడు. గణేశుని అభయం మేరకు కార్తవీర్యార్జునికి వేయి చేతులు వచ్చాయి. ఆ భుజబలంతో, మహాగణపతి దీవెనలతో భూమిపై ఉన్న శత్రురాజుల నందరిని జయించి కీర్తి పొందాడు. చివరకు మహాబలపరాక్రమవంతునిగా పేరుగాంచిన రావణుడు కూడా ఈ కార్తవీర్యార్జునిని చేతిలో ఓటమి చవిచూసినవాడే.

ఈ వ్రతం యొక్క ప్రాధాన్యత విశిష్ఠత మరియు దాని ఫలితాలను, ఆచరించే విధానాలను సూతుడు శౌనకాది మునులకు ఇలా వివరించాడు.

**వ్రత విధానం :** ప్రధానంగా మాఘ బహుళ మంగళవారం చవితి చతుర్థినాడు ఈ వ్రతం ఆచరించాలి. దీనివలన సర్వకార్యాలు సిద్ధించి అమృత యోగం పొందుతారు. ఆ రోజున తెల్లవారుజామునేలేచి అభ్యంగన స్నానమాచరించి 'సంకష్టహర గణపతీ! ఈ రోజున నీ వ్రతాన్ని ఆచరించి నీకు భక్ష్యములు, భోజ్యములు, పాయసం, మోదకములు నైవేద్యంగా సమర్పిస్తాను' అని నమస్కరించాలి.

ఆర్థికశక్తి ఉన్నవారు ఉదయం మహాగణపతి హోమం కావించవచ్చు. ఉపవాసముండి పగలంతయూ గణపతి స్తోత్రపారాయణ చేయాలి. సాయంత్రం అరటి బోదెలతో మంటపాన్ని నిర్మించి, మామిడి తోరణాలుకట్టి, పూజా యోగ్యమైన వివిధ రకములైన పుష్పమాలలతో మండపాన్ని శోభాయమానంగా అలంకరించి, బియ్యపు పిండితోగానీ, పసుపుతోగానీ అష్టదళ పద్మమును మండప మధ్యభాగము నందువేసి దానిపై నూతన వస్త్రమును పరచి దానిపై మట్టితోగానీ, వెండితోగానీ చేసిన చేసిన గణపతి విగ్రహమును, కలశమును ఉంచాలి. ఆపైన స్వామివారిని ఆవాహనం చేసి ఆసనం, పాద్యం,

అర్ఘ్యం, ఏకవింశతి పత్రపూజ. ఇలా యథావిధిగా షోడశోపచార పూజాదులను నిర్వహించాలి. మహాగణపతికి దూర్వాంకురాల (గరిక)తోనూ, బిల్వ పత్రంతో పూజచేసిన స్వామి మహాదానం పడతాడు. మోదకాలు, లడ్డూలు, పాయసం, శర్కాలతో స్వామి వారికి నైవేద్యం నివేదించాలి.

ముఖ్యంగా 21 ఉండ్రాళ్లు స్వామి వారికి నైవేద్యం పెట్టాలి. సప్తదోష నివారణగా ఈ నివేదన ప్రసిద్ధి.

పూజానంతరం వ్రతకథను చదివి అక్షింతలు స్వామివారికి కొన్నివేసి మిగిలినవి స్వామి ఆశీర్వచన అక్షింతలుగా భావించి శిరస్సున ధరించాలి. తోరమును ధరించాలనే సంకల్పం ఉన్నవారు నైవేద్యమునకు ముందు తోర పూజ కావించి ధరించవచ్చు. అటుతర్వాత 'ఓం గంగణపతియే నమః' అను మంత్రాన్ని 108 సార్లు జపించటం అన్ని విధాల శుభకరం.

వ్రతమాచరించినవారు అనంతరం తమ శక్త్యానుసారం ముత్తైదువులకి లేక బ్రాహ్మణులకి దానమివ్వాలి. ఆ రోజు రాత్రంతా శ్రీ గణేశధ్యానంతో జాగరణచేయాలి. మరునాడు తలస్నానంచేసి గణపతి వద్ద దీపారాధనచేసి స్వామికి నిత్యపూజ కావించి నైవేద్యం పెట్టడంతో వ్రతం చివరి అంకం పూర్తి అవుతుంది.

**వ్రతఫలితము :** ఈ వ్రతాన్ని పుత్ర,పౌత్రికా వివాహములు ముందుకానీ, ఉత్కృష్టమైన కార్యమును తలపెట్టినప్పుడుగానీ ఆచరిస్తే ఎంతో శుభకరమైన ఫలితాన్ని పొందుతారు. అష్టకష్టాలు మటుమాయమై కార్యవిజయమూ, ప్రశాంత చిత్తమూ కలుగుతాయి.

ఒక సంవత్సరంపాటు ఈ సంకష్టహరగణపతి వ్రతాన్ని భక్తితో ఎవరు ఆచరిస్తారో వారికి విశేష ఫలితాలు లభిస్తాయి. సమస్త కష్టాలు హరించుకు పోతాయి. విద్య, ధనము, వ్యాపారము నూతన గృహము సిద్ధిస్తాయి. పీడిత రోగాలు మటుమాయమౌతాయి.

భవసాగరమును దాటడానికి తాము తలంచిన ఉత్తమమైన సర్వకార్యములను స్వామి సిద్ధింపచేసి విజయం చేకూరుస్తారు అనడంలో ఎటువంటి అతిశయోక్తిలేదు. కుల, మత, జాతి, వర్ణ వివక్షతలు లేక అందరూ ఈ వ్రతమును ఆచరించి శ్రీమహాగణేశుని కృపకు పాత్రులు కావచ్చు.

(భక్తిసుధ సౌజన్యంతో)



## సంకష్ట హర చతుర్థి శ్రీమహాగణపతి వ్రతమాహాత్మ్యములు (పురాణోక్తముగా)

1. ధర్మరాజు ఈ వ్రతమంతు ఆచరించి యుద్ధములో శత్రువులను సంహరించి రాజ్యమును పొందెను.

2. ఏ వర్ణమువారైన ఈ వ్రతముచేసిన యెడల కోర్కెలు అన్ని తీరిపోయి మరణ కాలమున గణేశ సాన్నిధ్యమునుపొందును.

3. అహల్యాదేవి తన శాపము తొలగించి కొన్న తరువాత ఈ వ్రతమును ఆచరించి తన భర్త గౌతమ మహర్షిని జేరెను.

4. దమయంతీదేవి ఈ వ్రతమందు ఆచరించి తన భర్తయైన నలచక్రవర్తిని చేరి సుఖముగా నుండెను.

5. ఆంజనేయుడు లంకా నగరమున సీతాదేవిని వెదుకుచూ ఈ వ్రతము చేయుదును అని సంకల్పంచిగా అశోకవనమున సీతాదేవిని చూడ గలిగెను.

6. ఒకానొక సమయమున వాలిచే బంధించబడిన రావణుడు ఈ వ్రతము ఆచరించి సంకల్పించగా వాలి నుండి విముక్తుడై తన రాజధాని లంకా నగరము చేరుకొనెను.

7. పార్వతీదేవి ఈ వ్రతము ఆచరించి ఆ పుణ్యఫలముచే ఆరు మాసములలో శంకరుని భర్తగా పొందినది. ఇంకా ఫలితములలో పని ఏమి కావున ప్రతి ఒక్కరు యథాశక్తిగా ఈ వ్రతము ఆచరించగలరు.



## సంకష్టహర చతుర్థి శ్రీ మహాగణపతి వ్రతవిధులు

1. "కలౌచండీ వినాయకా" కలియుగంలో వెంటనే అనుగ్రహించే దేవతలు దుర్గ మరియు గణపతులు మాత్రమే అని శాస్త్రవచనం.

2. శ్రీగణేశునికి సంబంధించిన ఉపాసన, సాధన, మంత్ర, తంత్ర, విధానాలు, సాహిత్యం అన్ని 'గాణపత్యం' అనుపేరుతో ప్రసిద్ధిమయినది.

3. చతుర్థీ పూజనప్రీతః చతుర్థీ (చవితి) తిథి గణపతికి ప్రీతి. ఆ తిథినాడు ఆయన ఉద్భవించాడు. సర్వదారిద్ర్యాలు, భయరోగాది కష్టాలూ హరింపజేసే వినాయకుడి ప్రీతికరంగా చతుర్థీ వ్రతం చెప్పారు.

4. కృష్ణచతుర్థీ వ్రతం రోజున తెల్లవారుజామున లేచి గణేశుని స్మరించి స్నానాదులు చేసుకొని గణపతి మంత్రమును 108సార్లు ధ్యానించి, గణేశ స్తోత్రములు పారాయణ చేయవలెను.

5. ఆరోజు ఉపవాసం ఉండాలి. ఆనాటి సాయంత్రం వినాయకుని షోడశోపచారాలతో పూజించి ఉండ్రాళ్లు, లడ్లు, బెల్లం, మోద కాలు మొదలగు పదార్థములు నివేదించాలి.

6. ముఖ్యముగా 21 ఉండ్రాళ్ళు నివేదన చేస్తే అన్ని దోషాలు పోతాయి. అంతేకాక బిల్వ పుష్పాలతో మరియు గరికెతో పూజించాలి.

7. ముఖ్యముగా కృష్ణపక్షంలో వచ్చే చతుర్థీ (చవితి) చాలా ముఖ్యం.

8. కృష్ణచతుర్థి (అమావాస్య తరువాత వచ్చే) వ్రతాన్ని చంద్రోదయ ముతో చవితి తిథి ఉండాలి.

9. పూజానంతరం "ఓం గం గణపతయే నమః" అను మంత్రాన్ని 108 సార్లు జపిస్తే మంచిది.

10. ఈ వ్రతమును ఆచరించిన వారికి ధర్మ, అర్ధ, కామ, మోక్షాదులు తప్పక లభించును.

11. మట్టితోగాని వెండితోగాని గణపతి విగ్రహమును ప్రతిష్టజేసి కలశము వుంచి ఎనిమిది రేకుల కమలమును పిండితో లేక పసుపుపొడితో వ్రాసి కొత్త వస్త్రముపరచి దానిపై విగ్రహమును వుంచి పుష్పములతో, గరికతోను, బిల్వములతో గంధముతో అక్షతలతో పూజించవలెను.

12. వ్రతము పూర్తి అయిన పిదప యజ్ఞము చేసినచో మంచిది. యజ్ఞములో 108 మార్లు **ఓం గం సంకష్టమార గణపతయే నమః స్వాహా** అను మంత్రము చదువుతూ ఉండ్రాళ్ళు (మోదకములు) నెయ్యితో తడిపి వేయవలెను లేదా లక్ష్మిగణపతి హోమముచేస్తే చాలా మంచిది.

13. ఈ వ్రతము శ్రావణ బహుళ చతుర్థినాడు సాయం సమయము ఆచరించిన మంచిది. మరునాడు స్నానాంతరము 21 మంది బ్రాహ్మణులకు లేదా 7 బ్రాహ్మణులకు తాంబూలము, వస్త్ర, దక్షిణ, భోజనాదులు, సమర్పించి వీలైనచో శక్తిగలిగిన వారు గొడుగు, పాదుకులు, సమర్పించిన చాలా మంచిది.

14. విద్యనభ్యసించగోరువారు, ధనము కోరువారు, సంతానము కోరువారు, ఆరోగ్యము కావలసినవారు, వ్యాపారలాభము కోరువారు, కటుంబ సభ్యులతో స్నేహారాగములు కోరువారు, మంచి అందమైన భార్య గోరువారు, నూతన గృహము పొందగోరువారు, మహావ్యాధులు తగ్గించుకొనవలసినవారు, శత్రువులు పోరు తగ్గించుకోరువారు ఈ వ్రతమాచరించిన మంచిది.

15. గరికెపై ప్రమిద ఉంచి అందులో నువ్వులునూనెతోగాని, ఆవు నెయ్యిలోగాని గణపతికి ప్రీతికరమైన కొబ్బరినూనెపోసి దీపారాధన చేయడం చాలా మంచిది.

16. ముఖ్యముగా మూడువత్తులు దీపంవెలిగించండి. ఉత్తర ముఖముగా గణపతిదగ్గర ఉంచండి.

17. చివరివారములో శ్రీ సంకటహరచతుర్థీ వ్రతపుస్తకములు 21 లేదా 7గురి బ్రాహ్మణులకు దానముగా ఇవ్వవలెను.



# గమనిక

వ్రతము ఆచరించేవారు దీనిని తప్పక చదువవలెను.

ఈ వ్రతకల్పములో వేదమంత్రములను మం. అనే పేరుతోను పురాణోక్తమైన మంత్రాన్ని శ్లో. అనే పేరుతోను ఇవ్వబడ్డాయి. బ్రాహ్మణునితో చేయించుకున్నపుడు వేదమంత్రములతోను, స్వయంగా చేసుకునే సందర్భంలో శ్లోకములతోను వ్రత మును ఆచరించడం మంచిది.

మంత్రములను చక్కగా తప్పులులేకుండా పలకగలిగే వారు తమ అభీష్టము అనుసరించి చేసుకోవచ్చును.

స్వామివారికి శుద్ధోదక స్నానం చేసిన తరువాత మహా అభిషేకం చేసే సందర్భంలో చెప్పబడిన గణపత్యధర్వశీర్షమును పఠించలేనివారు మహాభిషేకమును వదలి వస్త్రోవస్త్ర సమర్పణం నుండి చేసుకోవచ్చును.

ఇక్కడ భక్తి ముఖ్యమని పాఠకులు గ్రహించాలి.





## ఈ వ్రతానికి ఆ పేరు ఎలా వచ్చింది.

ప్రతి మాసములో వచ్చే బహుళ చతుర్ధికి పౌర్ణమి తరువాతవచ్చే చవితి (4వతిధికి) సంకట అనే పేరు ఉండడంతో బహుళ చవితిని సంకట చతుర్ధి అంటారు. భక్తుల సంకష్ట (గొప్పఆపదలు లేదా కష్టములు తొలగిం చేది)ములు తొలగించేది కావజంతో సంకష్టహర చతుర్ధీ గణేశవ్రతము అనే పేరు వచ్చింది.

## ఈ వ్రతాన్ని ఎప్పుడు చేయాలి.

శ్రావణే బహుళే పక్షే చతుర్థ్యాంతు విధూదయే।
గణేశం పూజయిత్వాతు చంద్రాయార్ఘ్యం ప్రదాపయేత్।

శ్రావణ బహుళ చతుర్దినాడు పౌర్ణమి తరువాత వచ్చే చవితి తిథికి (4వతిథికి) సాయంత్రం చంద్రోదయం తరువాత గణపతిని పూజించి చంద్రు నకు అర్ఘ్యము ఇవ్వవలెను.

అదే విధముగా ప్రతి మాసములో వచ్చే బహుళ చవితినాటి పౌర్ణమి తరువాత వచ్చే చవితికి (4వతిధికి) సాయంకాలం ఈ వ్రతము ఆచరించ వచ్చును.

## వ్రత నియమాలు

1. వ్రతము రోజు శిరఃస్నానము చేయాలి. పగటి నిద్ర పనికిరాదు.
2. వ్రతము చేయురోజు పగలు ఏమి తినరాదు.
3. దేహ స్థితి అనుకూలించని వారు పాలు, పళ్ళు తీసుకోవచ్చును.
4 ఆనాడు పరుషముగా మాట్లాడడం వంటి పనులు చేయకుండా వీలైనంత వరకు మౌనంగా ఉండాలి. మనస్సులో గణపతిని ప్రార్ధించాలి.
5. నేతితో పదార్ధములను, తీపి పదార్ధములను స్వామి నివేదన చేయాలి.
6. వ్రతము పూర్తయిన పిదప ప్రసాద వితరణచేసి తాను భుజించాలి.

7. ప్రతి మాసములో అమావాస్య తరువాత చవితి, పౌర్ణమి తరువాత చవితి తిధులలో వ్రతము ఆచరించగలరు. అలామాసమునకు 2 చవితి తిధులు ఆచరిస్తే 21 సార్లు వ్రతము 10 మాసములలో పూర్తికాగలదు.
8. కేతుగ్రహమునకు అధిష్ఠాన దేవత గణేశుడు కావున 7 మార్లు ఒక ఆవృతము భావించాలి. 7×3=21సార్లు ఈ వ్రతమును ఆచరిస్తే అభీష్ఠల ప్రాప్తి కలుగుతుంది.
9. గరికెతో గణపతిపూజ చాలా ముఖ్యము. కావున వ్రతపూజా వస్తువులలో గరికె ఖచ్చితముగా ఉంచండి.
10. పూజా సమాప్తి తరువాత చంద్రదర్శనము చేసుకొని చంద్రునికి అర్ఘ్యం వదలాలి.
11. ఆ తరువాత బ్రాహ్మణునికి భోజనంపెట్టి (స్వయంపాకం ఇచ్చి) తాను భుజించాలి.
12. 21 మోదకాలు(ఉండ్రాళ్లు) నివేదన చేయాలి. ఒకటి స్వామి వద్ద ఉంచి 10 తాను ఉంచుకొని 10 ప్రసాద వితరణ చేయాలి.
13. రాత్రి 8.30 ని॥లకు పూజా ప్రారంభించాలి లేదా సాయంకాలం పూజ మొదలుపెట్టి చంద్రోదయం వరకు కొనసాగాలి.
14. కొంతమంది ప్రతి మాసములో బహుళ చతుర్థి (పౌర్ణమి తరువాత వచ్చే చతుర్థి) రోజు ఈ వ్రతమును ఆచరిస్తారు.
15. అలాచేస్తే 21మార్లుకు 21 మాసముల సమయము పడుతుంది.
16. సూర్యోదయానికి ముందేలేచి కాలకృత్యములు తీర్చుకొని మంచి వస్త్రములు ధరించి, గణపతి పటం ముందు నిలుచుని "మమ సర్వవిధ సంకటహర నివారణ ద్వారా శ్రీ మహాగణపతి ప్రీత్యర్థం అధ్య చంద్రో దయకాలే శ్రీమహాగణపతి పూర్వకం సంకష్టహర గణపతి వ్రత మహాం కరిష్యే" అని సంకల్పించాలి.
17. రాత్రి చంద్రోదయం వరకు నిరాహారముగా ఉండి "నీ పూజా వ్రతమును సమాప్తి చేసి నీకు నివేందించిన ప్రసాదం స్వీకరిస్తాను. నన్ను కష్టాలను నుండి గట్టెక్కించుస్వామి" అని మనస్ఫూర్తిగా ప్రార్థించాలి."
18. "శ్రీ నమోహేరంబ మమ సంకష్టం నివారయ నివారయ" అనే మూల మంత్రాన్ని 21మార్లు జపించాలి.



## వ్రతమునకు కావలసిన వస్తువులు

**1**. ఆవునెయ్యి 2. వెండికుందులు 3. గణపతి విగ్రహం (వెండిది) 4. రాగి/వెండి/ఇత్తడి కలశం 5. గణపతిఫోటో 6. కర్పూరం 7. పంచహారతి 8. వత్తులు 9. పసుపు 10. కుంకుమ 11. పూలమాల 12. అక్షతలు 13. విడిపూలు 14. పసుపురాసి ముగ్గులువేసిన పీట 15. ఆచమన పాత్ర మరియు ప్లేటు 16. ఉద్దరిణతో నీళ్ళు 17. గంధం 18. వక్కలు 19. తమలపాకులు 20. ఎరుపు లేదా పసుపు వస్త్రము (కలశస్థాపనకు) 21. ఉండ్రాళ్ళు 22. అరటిపళ్ళు 23. కొబ్బరికాయలు 24. కూర్చొనుటకు పీటలు 25. హారతిస్టాండు 26. పంచామృతాలు (ఆవుపాలు, నెయ్యి, పంచదార, ఆవుపెరుగు మరియు తేనె) 27. బియ్యం (శుభ్రంచేసిన నడుం విరుగనివి) 28. కొబ్బరికాయ కొట్టుటకు రాయి 29. గరక (పూజలకు) 30. వడపప్పు 31. చేయి తుడుచుకొనుటకు వస్త్రం 32. 21కుడుములు 33. గంట 34. గుమ్మానికి మామిడాకులు 35. సాయంత్రం భోజన పదార్థాలు (నైవేద్యం కొరకు) 36. చివరివారం 7 వ్రతపుస్తకాలు 37. బెల్లం 38. చెఱకు ముక్కలు 39. ఖర్జూరాలు 40. ఉలవచారు (నైవేద్య కొరకు)

## వ్రతం ఏ ఏ రోజులలో ప్రారంభించాలి

1. చవితి తిథి మంగళవారం వస్తే మంచిది.
2. చవితి తిథి బుధవారం వస్తే మంచిది.
3. చవితి తిథి హస్తా నక్షత్రం వస్తే మంచిది.

4. చవితి తిథి అశ్వని నక్షత్రం వస్తే మంచిది.
5. చవితి తిథి మఖ నక్షత్రం వస్తే మంచిది.
6. చవితి తిథి మూల నక్షత్రం వస్తే మంచిది.
7. చవితి తిథి ఆదివారము నక్షత్రం వస్తే మంచిది.

## వ్రత ఫలితములు

1. మొదటి 7 చవితి తిథులు నరఘోష శాంతి, ఆటంకములు తొలగును
2. రెండవ 7 చవితి తిథులు మనశ్శాంతి, మనస్థైర్యము
3. మూడవ 7 చవితి తిథులు విద్యావిజయము, గ్రహపీడ నివారణ
4. నాలుగవ 7 చవితి తిథులు అన్యోన్య దాంపత్యము, కుటుంబశాంతి
5. ఐదవ 7 చవితి తిథులు ఉద్యోగప్రాప్తి, ఉన్నతోద్యోగము
6. ఆరు 7 చవితి తిథులు ఆకస్మిక ధనప్రాప్తి
7. ఏడు 7 చవితి తిథులు సర్వకార్యసిద్ధి

## వ్రత ఫలితములు

1. భోగభాగ్యాలు సమృద్ధిగా లభిస్తాయి
2. అన్నిపనులకు ఆటంకములు నెరవేతాయి.
3. రైతులకు పాడిపంటలు బాగా పండుతాయి.
4. నిరుద్యోగులకు ఉద్యోగము లభిస్తుంది.
5. వ్యాపారస్తులకు వ్యాపారాభివృద్ధి కలుగుతుంది.
6. సంతానములేని దంపతులు వ్రతము ఆచరిస్తే సంతానము కలుగుతుంది.
7. విద్యార్థులకు ఆటంకములు తొలగి జ్ఞాపకశక్తి పెరుగుతుంది.
8. ఉద్యోగస్థులకు అవకాశములు పెరిగి ఉన్నత ఉద్యోగప్రాప్తి కలుగుతుంది.
9. గృహస్థులకు మనస్పర్ధలు తొలగి మనశ్శాంతితో ఉంటారు.
10. క్రొత్తగా గృహము కట్టదలచుకున్నవారు ఈ వ్రతము ఆచరిస్తే కడతారు.
11. భూ వ్యాపారములో ఉన్నవారికి ఈ వ్రతము బాగా యోగిస్తుంది.

శ్రీ మహాగణాధిపతయే నమః



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# సంకట హార చతుర్థీ
# శ్రీమహాగణపతి పూజ

మట్టితో చేసిన గణపతి విగ్రహాన్ని పూజించడం వల్ల కరువు కాటక ములు దరిచేరవని, పంటలు సమృద్ధిగా పండుతాయని ప్రతీతి. బంగారు గణపతి ప్రతిమ ఐశ్వర్యాభివృద్ధి, వెండి ప్రతిమ ఆయురారోగ్యాన్ని, రాగి ప్రతిమ సంకల్ప సిద్ధిని, శిలా ప్రతిమ మోక్ష జ్ఞానములను అనుగ్రహిస్తాయని పురాణాలు చెబుతున్నాయి.

శుద్ధి చేయబడిన పూజాస్థానంలో బియ్యం పిండితో అష్టదళపద్మాన్ని వేసి-దానిమీద -వినాయకుని విగ్రహాన్ని ఉంచాలి. ఒక పళ్ళెంలో బియ్యంపోసి దానిపై తమలపాకులో పసుపు గణపతిని స్థాపించవలెను. ముందుగా పసుపు గణపతిని పూజించాలి.

లాంఛన మార్జనం - ఆత్మశుద్ధి

ఎడంచేత్తో ఉద్ధరిణె(చెంచా)డు నీళ్ళు పట్టుకుని-

**శ్లో. అవిత్రః పవిత్రోవా - య దవస్థాంగతోపివా।**

**యః స్మరే పుండరీకాక్షం-సబాహ్యాభ్యంతరశ్శుచిః॥**

అని పఠించి "పుండరీకాక్ష,పుండరీకాక్ష,పుండరీకాక్ష" అనుకుంటూ- ఎడంచేతితో ఉన్న నీటిని కుడిచేతి బొటనవ్రేలితో 3సార్లు తమ శిరస్సుపై చల్లుకోవాలి.

దీపార్చన

**మం. దీపరాజాయ విద్మహే స్వప్రకాశాయ ధీమహి తన్నో**

**జ్యోతిః ప్రచోదయాత్ దీప స్వరూప పరబ్రహ్మణే**

**నమః యథాశక్తి పూజా నమస్కారం సమర్పయామి. !!**

శ్లో. దీపాయ బ్రహ్మరూపాయ విష్ణు రూపాయతే నమః !
రుద్రరూప నమస్తుభ్యం దీపరూపాయతే నమః !

**పిదప నేతి దీపాన్ని వెలిగించి, నమస్కరించాలి.**

**ఓం కేశవాయస్వాహా! ఓం నారాయణాయస్వాహా ! ఓం మాధవాయస్వాహా**

**పై నామములు చెప్పుచు 3 పర్యాయములు ఆచమనం చేయవలెను.**

**ఓం గోవిందాయనమః ఓం విష్ణవేనమః ఓం మధుసూదనాయ నమః ఓం త్రివిక్రమాయ నమః ఓం వామనాయనమః ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయ నమః ఓం పద్మనాభాయనమః ఓం దామోదరాయనమః ఓం సంకర్షణాయనమః ఓం వాసుదేవా యనమః ఓం ప్రద్యుమ్నాయనమః ఓం అనిరుద్ధాయ నమః ఓం పురుషోత్తమాయనమః ఓంఅధోక్షజాయనమః ఓం నారసింహా యనమః ఓం అచ్యుతాయనమః ఓం జనార్ధనాయనమః ఓం ఉపేంన్ద్రాయనమః ఓం హరయేనమః ఓం శ్రీకృష్ణాయనమః**

## భూతోచ్చాటనము

**శ్లో.ఉతిష్ఠన్తు భూతపిశాచాః యే తే భూమిభారకాః**
**ఏతేషా మ విరోధేన బ్రహ్మకర్మ సమారభే.**

**రెండక్షతలు వాసన చూసి తమ వెనకకు వేసుకోవాలి.**

## ప్రాణాయామము

ఓం భూః। ఓం భువః। ఓం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం సత్యమ్। ఓం తత్సవితుర్వ రేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్ । ఓం మాపో జ్యోతి రసో మృతం బ్రహ్మ భూ ర్భువ స్సువ రోమ్ ॥

## సర్వదేవతా ప్రార్థనం

**శ్లో. యశ్శివో నామరూపాభ్యాం యాదేవి సర్వమంగళా**
**తయో స్సంస్మరణా త్పంసాం సర్వతో జయమంగళమ్ ।**

**శ్లో. లాభస్తేషాం జయస్తేషాం కుత స్తేషాం పరాభవః**
**యేషా మిందిరాశ్యామో హృదయస్థో జనార్ధనః ॥**

**శ్లో. ఆపదా మపహర్తారం దాంతారం సర్వసంపదామ్।**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం॥**

**శ్లో. సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే।**
**శరణ్యే త్ర్యంబకేదేవీ నారాయణి నమోస్తుతే॥**

ఓం లక్ష్మీనారాయణాభ్యాం నమః ! ఉమామహేశ్వరాభ్యాంనమః! వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః ! శచీపురందరాభ్యాం నమః ! అరుంధతి వసిష్ఠాభ్యాం నమః ! శ్రీ సీతారామాభ్యాం నమః ! సర్వేభ్యో మహాజనేభ్యో నమః ! అయం ముహూర్త స్సుముహూర్తోస్తు.

**సఙ్కల్పం**

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్ధిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీమహావిష్ణోరాజ్ఞేయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరత వర్షే భరత ఖండే మేరో ర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య. ఈశాన్య. (**తాామున్న ప్రదేశ దిక్కు**) ప్రదేశే కృష్ణా గోదావర్యోర్మధ్య ప్రదేశే స్వ/శోభన గృహే సమస్తదేవతా బ్రాహ్మణ హరిహరగురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్రమానేన. . . . సంవత్సరే. ..అయనే. ఋతౌ..మాసే...పక్షే...తిథౌ శ్రీమాన్ ......గోత్రస్య నామధేయోహం మమ (**సకుటుంబస్య**) క్షేమ స్థైర విజయాయురారోగ్యైశ్వర్య విద్యాభివృద్ధ్యర్థం(ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ ఫలవ్యాప్త్యర్థం) చింతిత మనోరధ సిద్ధ్యర్థం సర్వ కామనానఫలీకృతార్థం మమ జన్మరాశి వశాత్–నామరాశివశాత్ –జన్మ నక్షత్రవశాత్ – నామనక్షత్రవశాత్ – నామలగ్నవశాత్ – జన్మాంశవశాత్ –నామాంశవశాచ్చ –మహాదశా ధివశాత్– షడ్బలవేధవశాత్–గోచారవేధ వశాత్–ద్వామ వేధవశాత్ ! త్రివిధ శాస్త్రోక్త వేధవశాత్కాలచక్ర వశాత్స ర్వతో భద్రచక్రవశాచ్చ అష్టకవర్గవచ్చ–అంగ గ్రహవశాచ్చ– భావగ్రహ వశా త్పక్షగ్రహ వశాచ్చ–అథనక్షత్ర గ్రహవశాచ్చ– అథనామాంశ వశాదభ్బాత గ్రహవశాచ్చ యో అరిష్టవశాచ్చజ భూతాద్యంతరిక్ష మహోత్పాతక దుస్వప్న దుశ్శకు వశాచ్చ యో అరిష్ట సూచస్సూచితః

తదరిష్ట పరిహార ద్వారా ఆయుష్యాభి వృద్ధ్యర్థం యేయే గ్రహాః శుభస్థానేషుస్థితాః తేషాంగ్రహాణ మతిశయఫలా వ్యాప్త్యర్థం యేయే గ్రహాః అరిష్ట స్థానేషుస్థితాః తైస్తైః క్రియమాణ కరిష్యమాణ వర్తమాన వర్తిష్యమాణ సూచితాగామి సర్వారిష్ట పరిహార ద్వారా శుభస్థాన ఫలవ్యాప్త్యర్థం మమ సకుటుంబస్య దీర్ఘాయుర్విపుల ధనధాన్య పుత్రపౌత్రా ద్యనవచ్ఛిన్న సంతతి కీర్తివృద్ధి లాభ శత్రుపరాజయాది సదభీష్ట సిద్ధ్యర్థం శ్రీగణేశ దేవతా ముద్దిశ్య - శ్రీగణేష దేవతా ప్రీత్యర్థం సంభవతా నియమేన స్కాంద మహాపురాణోక్త విధానేన సంకష్టచతుర్థీ వ్రత మహంకరష్యే, కర్మ కరిష్య మాణ స్తదంగత్వేన తతాదౌ శుద్యర్థం వృద్ధ్యర్థం శాన్త్యర్థం అభ్యుదయా ర్థంచ మహాజనైస్సహ స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే। ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే। తదంగ కలశారా ధనం కరిష్యే ।

అని నీటిని స్పృశించవలెను.

**కలశపూజ**

**కలశములో గంధం, పుష్పములు, అక్షతలతో అలంకరించి ఒక పుష్పమును లేదా తమలపాకును ఆ కలశమునందుంచి ఇట్లు చెప్పవలెను.**

శ్లో. కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రః సమాశ్రితః ।
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్య మాతృ గణాః స్మృతా ః ।
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదోథ యజుర్వేదః సామవేదోహ్యథర్వణ ః ॥

1 అంగైశ్చ సహితాః సర్వే కలశాంబు సమాశ్రితాః ।

**మం.ఆకల శేషుధావతి పవిత్రే పరిషిచ్యతే। ఉక్థై ర్యజ్ఞేషువర్ధతే। ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వా భూతాన్యాప ః ! ప్రాణావా ఆప ః ! పశవ అపో న్న మాపో మృతమాప స్సమ్రాడాపో విరాడాపస్స్వ రాడప శ్చందాగ్స్యాపో జ్యోతిగ్ష్యాపో యుజుష్యాపస్సత్య మాప సర్వాదేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్ ॥**

**గంగేచ యమునే చైవ కృష్ణే గోదావరి సరస్వతి।**
**నర్మదే సింధు కావేర్యా జలేస్మిన్ సన్నిధిం కురు ॥**

ఆయాంతు దేవపూజార్థాం దురితక్షయ కారకాః ॥

కలశోదేకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవ మాత్మానం చ సంప్రోక్ష్య ॥

కలశంలోని నీటిని దేవునిపైన, తమపైన, పూజాద్రవ్యాలపైన పూవుతో చల్లుకోవాలి.

అథ గణపతి పూజ

పసుపుగణపతినిచేసి-తమలపాకునందు ఉంచి-దానిని మండపము అగ్రభాగమున ఉంచి పూజించవలెను.

మం. ఓం గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశవస్తమం। జ్యేష్ఠరాజం బ్రహ్మణా బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వ న్నూతిభి స్సీద సాధనం ॥

శ్లో. శుక్లామ్ భరధరమ్ విష్ణుమ్ శశి వర్ణమ్ చతుర్భుజమ్।
ప్రసన్న వదనమ్ ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాన్తయే ॥

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ఆవాహయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ఆసనం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః అర్ఘ్యం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః స్నానాంతరం ఆచమనీయం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః గంధం ధారయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః అక్షతాన్ సమర్పయామి.
ఓం శ్రీ మహాగణాధిపతయే నమః పుష్పైః పూజయామి.

ఈ క్రింది మంత్రములతో స్వామివారిని పుష్పములతో పూజించవలెను.

1. ఓం సుముఖాయ నమః
2. ఓం ఏకదంతాయ నమః
3. ఓం కపిలాయ నమః
4. ఓం గజకర్ణికాయ నమః
9. ఓం ధూమకేతవే నమః
10. ఓం గణాధ్యక్షాయ నమః
11. ఓం ఫాలచంద్రాయ నమః
12. ఓం గజాననాయ నమః

**5. ఓం లంబోదరాయ నమః**
**6. ఓం వికటాయ నమః**
**7. ఓం విఘ్నరాజాయ నమః**
**8. ఓం గణాధిపాయ నమః**
**13. ఓం వక్రతుండాయ నమః**
**14. ఓం శూర్పకర్ణాయ నమః**
**15. ఓం హేరంబాయ నమః**
**16. ఓం స్కంధపూర్వజాయ నమః**

**సర్వసిద్ధి ప్రదాయకాయనమః**

**ఓం మహాగణాధిపతయేనమః నానా విధ పరిమళ మంత్ర పుష్పాక్షతాని సమర్పయామి.**
**ఓం మహాగణాధిపతయే నమః ధూపమాఘ్రాపయామి.**
**ఓం మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి.**
**ధూపదీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.**
**ఓం మహాగణాధిపతయే నమః నైవేద్యం నివేదయామి.**

ఓం భూర్భువస్సువ ః ! తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి ! దియో యోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి ! అమృతమస్తు అమృతో పస్తరణమసి స్వాహా ! ఓం ప్రాణాయస్వాహా ! ఓం అపానాయ స్వాహా ! ఓం వ్యానాయ స్వాహా ! ఓం ఉదానాయ స్వాహా ! ఓం సమానాయ స్వాహా ! ఓం బ్రహ్మణేస్వాహా! మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిథానమసి. ఉత్తరాపోశనం సమర్పయామి. హస్తౌ ప్రక్షాళ యామి. పాదౌ ప్రక్షాళయామి. ముఖే ఆచమనీయం సమర్పయామి.

**ఓం శ్రీ మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి.**
**ఓం శ్రీ మహాగణాధిపతయే నమః నీరాజనం సమర్పయామి.**
**నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.**
**ఓం శ్రీ మహాగణాధిపతయే నమః మంత్రపుష్పం సమర్పయామి.**
**ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.**

**ఓంశ్రీ మహాగణాధిపతయే నమః** సమస్త రాజోపచార, దేవోపచార, భక్త్యోపచార, శక్త్యోపచార పూజాం సమర్పయామి. సర్వాభావే అక్షతాన్ సమర్ప యామి.

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః ।శ్రీ మహాగణాధిపతి స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు ॥

ఓం శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి.

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః యధాస్థానే ప్రతిష్ఠాపయామి. క్షేమాయ పునరాగ మనాయచ। ఇతి ఉద్వాసయేత్॥

శ్రీ గణపతి విగ్రహమును ఉత్తరము వైపు జరుపవలెను.

పుణ్యాహం వాచయిష్యే (శుద్ధి పుణ్యాహవాచనము జరుపవలెను.)

తిరిగి ఆచమనము చేసి ఈ క్రింది సంకల్పము చెప్పుకొనవలెను.

పునః ప్రాణానాయమ్య.....శ్రీ సంకష్ట గణేశ దేవతా ప్రీత్యర్థం ఇతః పూర్వ సంకల్పిత సకలమనో వాంఛాఫల సిద్ధ్యర్థం గణేశ సంకట చతుర్థి వ్రతం కరిష్యే !

తదంగమంటపారాధనం కరిష్యే అని అక్షతలు నీరు వదలవలెను.

ఇకపై చెప్పబడే పూజను ప్రధాన విగ్రహమునకు చేయవలెను.

అథ ధ్యానం

మం.ఓం సహస్ర శీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్
స భూమిం విశ్వతో వృత్వాఽ త్యతిష్ఠద్దశాంగుళమ్.

శ్లో.ఏకదంతం శూర్పకర్ణం- గజవక్త్రం చతుర్భుజం।
పాశాంకుశ ధరం దేవం-సంకష్టహర మవ్యయమ్।

శ్లో.ధ్యాయే దేవం మహాకాయం-తప్తకాంచన సన్నిభం।
దంతాక్షమాలా పరశు-పూర్ణమోదక హస్తకమ్॥
మోదకాసక్త శుండాగ్ర-మేకదంతం వినాయకమ్॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః ధ్యాయామి.

ఆవాహనం

మం.ఓం పురుష ఏవేదగ్ం సర్వం- యద్భూతం యచ్చ భవ్యం
ఉతామృతత్వస్యేశానో-యదన్నేనాతిరోహతి॥

శ్లో.ఆగచ్ఛ దేవదేవేశ సంకటాన్మాం నివారయ।
యావద్వ్రతం సమాపేత్య తావత్త్వం సన్నిధౌ భవ॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః ఆవాహయామి.

ఆసనం

శ్లో.విచిత్ర రత్న రచితం-దివ్యాస్తరణ సంయుతం।
స్వర్ణ సింహాసనం చారు-గృహాణ!సురపూజిత॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః రత్న ఖచిత సింహాసనం సంభావ్య బాహ్యా తయా ఆసనార్థే-అక్షతాన్ సమర్పయామి.

## పాద్యం

మం.ఓం ఏతావనస్య మహిమా-అతో జ్యాయంశ్చ పూరుషః

పాదోఽస్య విశ్వా భూతాని-త్రిపాదస్యామృతం దివి.

**శ్లో. సర్వతీర్థ సమానీతం-పాద్యం గంధాది సంయుతం।**

**విఘ్నరాజ! గృహాణేదం-భగవన్ భక్తవత్సల॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః పాదయోః పాద్యం సమర్పయామి.

## అర్ఘ్యం

మం.ఓం త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః-పాదో స్యేహభవత్పునః।

తతో విష్వఙ్వ్యక్రామత్సాశనానశనే అభిః॥

**శ్లో.అర్ఘ్యం చ ఫలసంయుక్తం-గంధపుష్పాక్షతైర్యుతం।**

**గణాధ్యక్ష! నమస్తేస్తు-గృహాణ! కరుణానిధే॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

## మధుపర్కం

**శ్లో. ధధ్యాజ్య మధుసంయుక్తం-మధుపర్కం మయాఽహృతం।**

**గృహాణ సర్వలోకేశ-గణనాథ నమోస్తుతే**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః పాదయోః మధుపర్కం సమర్పయామి.

(పెరుగు, నెయ్యి, తేనె కలిపి దానిని పుష్పముతో దేవుని పెదవులకు తాకించవలెను'

## ఆచమనం

మం.ఓం తస్మా ద్విరాడజాయత-విరాజో అధిపూరుషః

స జాతో అత్యరిచ్యత- పశ్చా ద్భూమి మథోపురః

**శ్లో. వినాయక నమస్తుభ్యం-త్రిదశై రభివందిత।**

**గంగాహృతేన తోయేన-శీఘ్రమాచమానం కురు॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.

ఇక్కడనుండి చెప్పబడిన పంచామృతస్నానములు ప్రారంభమవు తున్నాయి. ఇవి చేయలేనివారు శుద్ధోదక స్నానమునుండి చేయించవలెను.

## మలాపకర్షణ స్నానం

మం.ఓం తత్పురుషేణ హవిషా-దేవ యజ్ఞ మతన్వత

వసంతో ఆస్యాసీదాజ్యం- గ్రీష్మ ఇధ్మ శ్శర ద్ధవిః॥

**శ్లో. గంగాది సర్వ తీర్థేభ్యః ఆనీతం తోయ ముత్తమం**
**భక్త్యా సమర్పితం తుభ్యం-స్నానాయాభీష్టదాయక॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః మలాపకర్షణ స్నానం సమర్పయామి.
అనుచూ పుష్పములతో కలశోదకమును చల్లవలెను.

పంచామృత స్నానం

మం.ఓం ఆప్యాయస్వ సమేతు తే- విశ్వతః సోమ వృష్టియం
భవావాజస్య సంగధే॥

**శ్లో. కామధేను సముద్భూతం-పరమం పావనం పయః॥**
**తేన స్నానం కురుష్వ త్వం- హేరంబ! గణనాయక॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః క్షీర స్నానం సమర్పయామి.

పెరుగు

మం.ఓం దధిక్రావణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజనః।
సురభినో ముఖాకరత్ ప్రాణా ఆయుగ్ంషి తారిషాత్॥

**శ్లో. చంద్రమండల సంకాశం-సర్వదేవ ప్రియం దధి।**
**స్నానార్థం తే ప్రయచ్ఛామి-గృహాణ గణనాయక॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః దధి స్నానం సమర్పయామి.

ఆజ్యం(నెయ్యి)

మం.ఓం ఘృతం మిమిక్షే- ఘృత మస్య యోని ర్ఘృతే శ్రితో
ఘృతం వస్య ధామ-అనుష్వధ మావహ
మాదయస్య స్వాహా-ఘృతం వృషభవక్షి హవ్యమ్.

**శ్లో. ఆజ్యం సురాణ మాహార- ఆజ్యం యజ్ఞే ప్రతిష్ఠితం।**
**ఆజ్యం పవిత్రం పరమం- స్నానార్థం ప్రతిగృహ్యతామ్॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః ఘృత స్నానం సమర్పయామి.

మధు(తేనె)

మం.ఓం మధువాతా ఋతాయతే-మధు క్షరంత సింధవః।
మాధ్వీర్నస్సన్త్వోషధీ-మధునక్త ముతోషసీ
మధుమత్పార్థివగ్ం రజః
మధు ద్యౌరస్తు సః పితా-మధుమానోవనస్పతి-ర్మధుమాగ్ం
అస్తు సూర్యః

మాధ్వీర్గావో భవంతునః॥

**శ్లో. సర్వౌషధి సముద్భూతం-పీయూష మధురం మధు।**

**స్నానార్థం తే ప్రయచ్ఛామి-గృహాణ! గిరిజాసుత! ॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః మధుస్నానం సమర్పయామి.

శర్కర

మం.ఓం స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే- స్వాదు రింద్రాయసహోవీతునామ్నే

స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః

**శ్లో. ఇక్షుదండ సముద్భూత దివ్య శర్కరాయ హవ్యం।**

**స్నపయామి మహాభక్త్యా ప్రీతోభవ శివాత్మజ !॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః శర్కరాస్నానం సమర్పయామి.

ఫలోదక స్నానం

మం.యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః।

బృహస్పతిః ప్రసూతా స్తానోముంచ త్వగ్ంహసః॥

**శ్లో. నారికేళోదకం దేవ శుద్ధ గంగా జలోపమం।**

**అమృత స్వాదు గృహ్ణీధాః స్నానార్థం వరదో భవ॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః ఫలోదక స్నానం సమర్పయామి.

శుద్ధోదక స్నానం

మం.ఓం ఆపోహిష్ఠా మయోభువః।తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే- యోవశ్శివతమోరసః। తస్య భాజయతే హనః। ఉశతీరవ మాతరః । తస్మా అరంగ మామవః। యస్యక్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః।

**శ్లో. కర్పూరైలా సమాయుక్తం సుగంధ ద్రవ్య సంయుతం।**

**శుద్ధోదకం గణాధ్యక్ష స్నానార్థం ప్రతిగృహ్యతామ్॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

**శ్రీ సంకట హర గణపతయే నమః వస్త్రోపవస్త్రార్థే యజ్ఞోపవీతార్థే చ అక్షతాన్ సమర్పయామి, విలేపనార్థే చందనం, అలంకరణార్థే అక్షతాంశ్చ, పూజార్థే పుష్పాణి సమర్పయామి. ధూపమాఘ్రాపయామి, దీపం ప్రదర్శయామి. నైవేద్యార్థే పంచామృత**

**శేషం సమర్పయామి, ఉత్తరాపోశనం, హస్తౌ ప్రక్షాళయామి, ముఖ ప్రక్షాళనం, కరోద్వస్తనార్థే చందనం, ముఖవాసార్థే తాంబూలం, స్వర్ణ పుష్ప దక్షిణాం చ సమర్పయామి.**

**శేషోపచారే నమస్కరోమి.** అనేన పూర్వారాధనేన భగవాన్ సర్వాత్మకః శ్రీ సంకష్ట హర గణపతిః, ప్రీయతాం న మమ॥ అనుచు ఉదకమును విడువ వలెను.

తరువాత- దేవునిపై ఉంచిన నిర్మాల్యమును తీసి కళ్ళకద్దుకుని ప్రక్కగా ఉంచి అధర్వ శీర్షోపనిషత్తు చదువుతూ మహాభిషేకము చేయవలెను.

## గణపత్యధర్వశీర్షము

ఓం నమస్తే గణపతయే త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి- త్వమేవ కేవలం కర్తాఽసి-త్వమేవ కేవలం ధర్తాఽసి త్వమేవ కేవలం హర్తాఽసి- త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి- త్వం సాక్షాదాత్మాఽసి నిత్యం- ఋతం వచ్మి- సత్యం వచ్మి-అవత్వం మాం-అవ వక్తారం-ఆకశ్రోతారం-అవదాతారం-అవ ధాతారం, అవా సూచాన మవ శిష్యం-అవ పశ్చాత్తాత్. అవ పురస్తాత్- అవోత్తరాత్తాత్-అవ దక్షిణత్తాత్- అవ చోర్ధ్వాత్తాత్-అవ ధరాత్తాత్- సర్వతో మాం పాహి పాహి సమంతాత్- త్వం వాఙ్మయ స్త్వం చిన్మయః- త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి- త్వం జ్ఞానమమో విజ్ఞాన మయోసి- సర్వం జగదిదం త్వత్తోజాయతే- సర్వం జగదిదం త్వత్తస్తిష్టతి సర్వజగ దిదం త్వయిలయ మేష్యతి- సర్వం జగదిదం తవ ప్రత్యేతి- త్వం భూమి రాపోఽనలోఽనిలో నభత్వం చత్వారి వాక్పదాని. త్వ గుణత్రయాతీతః- త్వం కాలత్రయ తీతః- త్వం దేహత్రయాతీతః- త్వం మూలాధార స్థితోఽసి నిత్యం- త్వం శక్తి త్రయాత్మకః- త్వాం యోగినో ధ్యాయంతి నిత్యం- త్వం బ్రహ్మత్వం విష్ణుస్త్వం రుద్రస్త్వ మింద్రస్త్వ మగ్నిస్త్వం వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం బ్రహ్మ భూర్భు వస్సువరోమ్-గణాదిం పూర్వముచ్చార్య వర్ణాదిం తదనంతరం-అనుస్వారః పరతరః

-అర్ధేందులసితం- తారేణరుద్ధం-ఏత త్తవ మను స్వరూపం- గకారః పూర్వరూపం- ఆకారో మధ్యమరూపం అనుస్వార శ్చాంత రూపం- బిందురుత్తర రూపం- నాద స్సంధానం- సగ్ంహితా సంధిః- సైషా గణేశ విద్యా-గణక ఋషిః- నిచృద్గాయత్రి చ్ఛంధః- గణపతి ర్దేవతా-ఓం గం గణపతయేనమః-ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి- తన్నో దంతిః ప్రచోదయాత్- ఏకదంతం చతుర్హస్తం పాశ మంకుశ ధారిణం- రదం చ వరదం హస్తైర్బి భ్రాణం మూషక ధ్వజం-రక్తం లంబోదరం శూర్పకర్ణం రక్త వాసనం-రక్త గంధాను లిప్తాంగం రక్త పుష్పైస్సు పూజితం-భక్తాను కంపితం దేవం జగత్కారణ మచ్యుతం- ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ ప్రకృతేః పురుషాత్పరం-ఏవం ధ్యాయతి యో నిత్యం స యోగి యోగినాం వరః- నమో వ్రాత పతయే నమో గణపతయే నమః ప్రమథపతయే నమస్తే అస్తు లంబోదరాయైక దంతాయ విఘ్ననాశినే శివసుతాయ వరదమూర్తయే నమః

ఆసక్తి కలవారు శక్తి కొలది 3, 11, 21 సార్లు అభిషేకము చేసి చివరలో ఫలశ్రుతిని చదువగలరు.

## ఫలశ్రుతి

ఏత ధథర్వశీర్షం యోఽధీతే-స బ్రహ్మభూయాయ కల్పతే-స సర్వత స్సుఖ మేధతే-స సర్వవిఘ్నైర్న బాధ్యతే-న పంచ మహాపాపాత్ ప్రముచ్యతే-సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి-ప్రాతర ధీయానో రాత్రికృతం పాపం నాశయతి సాయం ప్రాతః ప్రయుంజానో ఆపాపోభవతి. సర్వత్రాధీయానో పవిఘ్నో భవతి. ధర్మార్థ కామ మోక్షం చ విందతి. ఇద మథర్వశీర్ష మశిష్యాయ న దేయం-యో యది మోహా ద్దాస్యతి న పాపీయాన్ భవతి-సహస్రావర్తనాత్ యం యం కామ మధీతే-తంతమనేన సాధయేత్-అనేన గణపతి శుభిషించతి సవాగ్మీ భవతి- చతుర్థ్యా మనశ్నన్ జపతి న విద్యావాన్ భవతి-ఇత్యధర్వణ వాక్యం-బ్రహ్మాద్యాచరణం విద్యాత్-న బిభేతి కదాచనేతి-యో దూర్వాం కురై ర్యజతి న వై శ్రోవణోంపమో భవతి-యో మోదక సహస్రేణ

యజతి సవాంఛిత ఫలమవాప్నోతి. య స్సాజ్య సమిద్భిర్యజతి స సర్వం లభతే న సర్వం లభతే-అష్టౌ బ్రాహ్మణాన్ సమ్య గ్గ్రాహయిత్వా సూర్యవర్చస్వీ భవతి-సూర్యగ్రహే మహానద్యాం ప్రతిమా సన్నిధౌ వా జప్త్వా సిద్ధ మంత్రో భవతి-మహావిఘ్నాత్ ప్రముచ్యతే-మహా దోషాత్ ప్రముచ్యతే- మహా పాపాత్ ప్రముచ్యతే- స సర్వవిద్భవతి- స సర్వవిద్భవతి- య ఏవం వేద-ఇత్యుపనిషత్.

శ్రీ సంకటహర-గణపతయే నమః- మహాభిషేకం సమర్పయామి.

ఈ క్రింద మంత్రము చదువుతూ, అభిషేక జలమును శిరస్సుపై చల్లుకోవాలి.

అమృతాభిషేకోఽస్తు-రత్నాభిషేకోఽస్తు. సువర్ణాభిషేకోఽస్తు.

"ఏక దంతాయ విద్మహే- వక్ర తుండాయ ధీమహి-తన్నో దంతిః ప్రచోదయాత్.

శ్రీ సంకష్ట హర గణపతయే నమః శుద్ధ వస్త్రేణ ఉద్వర్షయామి.
శుభ్రమైన వస్త్రముతో మూర్తిని తుడవాలి.

## ఆచమనం

శ్రీసంకష్టహర గణపతయే నమః మహాభిషేక స్నానంతరం
ఆచమనీయం సమర్పయామి.

## ప్రతిష్ఠాపనం

మం.ఓం తదస్తు మిత్రావరుణా తదగ్నే శంయో రస్మభ్య మిదమస్తు శస్త్రం- అశీమహి గాధమత ప్రతిష్ఠాం- నమో దివే బృహతే సాదనాయ. గృహ వై ప్రతిష్ఠా సూక్తం తత్ప్రతిష్ఠిత మయా వాచా తంస్తవ్యం తస్మాద్యదపి దూర ఇవ పశూంల్లభతే గృహానేవై నానాజిగ మిషతి గృహా హి పశూనాం ప్రతిష్ఠా ప్రతిష్ఠా-నర్యం ప్రజాం
మే గోపాయ-అమృతత్వాయ జివసే.

జాతం జనిష్యమాణాం చ అమృతే సత్యే ప్రతిష్ఠితామ్.

శ్రీ సంకష్ట హర గణపతయే నమః సుప్రతిష్ఠతమస్తు.

(అనుచూ వినాయకుని పాదములపై అక్షతలు వేయవలెను.)

## వస్త్రోపవస్త్ర సమర్పణం

మం.ఓం తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్-పురుషం జాత మగ్రతః।
తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చ యే.

**శ్లో. రక్త వస్త్రయుగ్మం దేవ దివ్యం కాంచన సంభవం**
**సర్వప్రద ! గృహాణేదం- లంబోదర! హరాత్మజ!**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః వస్త్రోపవస్త్ర సమర్పయామి. (ఇచ్చట స్వామి వారికి కండువా సమర్పించాలి.)

## భస్మం

మం.ఓం త్ర్యంబకం యజామహే- సుగంధిం పుష్టి వర్ధనం-
ఉర్వారుక మివ బంధనాత్- మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్

శ్రీ సంకష్ట హర గణపతయే నమః విభూతిం సమర్పయామి.
(విభూతిని స్వామివారి నొసటన చేతులు పాదములపై అద్దాలి)

## యజ్ఞోపవీతం

మం.ఓం తస్మా ద్యజ్ఞా స్సర్వహుతః సంభృతం వృషదాజ్యం.
పశూన్ తాగ్ంశ్చక్రే వాయువ్యా నారణ్యాన్ గ్రామ్యాశ్చ యే

**శ్లో. రాజతం బ్రహ్మసూత్రం చ కాంచనం చోత్తరీయకం.**
**గృహాణ! చారు సర్వజ్ఞ! భక్తానాం వరదో భవ!॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

## శ్రీగంధం

మం.ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచ స్సామాని జజ్ఞిరే
చందాగ్ం సి జజ్ఞిరే తస్మా ద్యజు స్తస్మా దజాయత.

**శ్లో. కస్తూరి రోచనా చంద్ర కుంకుమేన సమన్వితం।**
**విలేపనం సురశ్రేష్ఠ। చందనం ప్రతి గృహ్యతామ్॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః శ్రీగంధం సమర్పయామి.

## అక్షతలు

**శ్లో. రక్తాక్షతం శ్చ దేవేశ గృహాణ! ద్విరదానన।**
**లాలటపటలే చంద్ర స్తస్యోపరి విధార్యతామ్॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః రక్షాక్షతాన్ సమర్పయామి.

## సింధూరం

శ్లో. ఉద్యద్భాస్కర సంకాశం సంధ్యావదరుణం ప్రభో।
వీరాలంకరణం దివ్యం సింధూరం ప్రతిగృహ్యతామ్॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః సింధూరం సమర్పయామి.

## పరిమళ ద్రవ్యం

శ్లో. జ్యోత్స్నాపతే నమస్తుభ్యం నమస్తే విశ్వరూపిణే।
నానా పరిమళ ద్రవ్యం గృహాణ! పరమేశ్వర! ॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః నానావిధపరిమళ ద్రవ్యం సమర్పయామి.

## పుష్పం

మం.ఓం తస్మా దశ్వా అజాయంత యే కే చోభయా దశః।
గావో హ జజ్ఞిరే తస్మా జ్జాత అజావయః॥

శ్లో. చంపకం మల్లికాదూర్వా పుష్పజాతీరనేకశః
గృహాణత్వం గణాధ్యక్ష సంకటం మే నివారయ॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః పుష్పమాలికాం సమర్పయామి. (స్వామి వారికి పుష్పమాలను సమర్పించాలి.

## అంగపూజనం

గణేశాయ నమః పాదౌ పూజయామి.
ఏకదంతాయ నమః గుల్ఫౌ పూజయామి.
విఘ్నరాజాయ నమః జానునీ పూజయామి.
కామారిసూనవే నమః జంఘే పూజయామి.
అఖువాహనాయ నమః ఊరూ పూజయామి.
హేరాంబాయ నమః కటిం పూజయామి.
లంబోదరాయ నమః ఉదరం పూజయామి.
గణనాథాయ నమః హృదయం పూజయామి.
స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి.

పాశహస్తాయ నమః హస్తౌ పూజయామి.
గజవక్త్రాయ నమః వక్త్రం పూజయామి.
విఘ్నహంత్రే నమః నేత్రౌ పూజయామి.
శూర్పకర్ణాయ నమః కర్ణౌ పూజయామి.
ఫాలచంద్రాయ నమః లలాటం పూజయామి.
సర్వేశ్వరాయ నమః శిరః పూజయామి.
శ్రీ గణాధిపాయ నమః సర్వాణ్యంగాని పూజయామి.

## అంగపూజనం

సుముఖాయ నమః మాచిపత్రం పూజయామి.
గణాధిపాయ నమః బృహతీ పత్రం పూజయామి.
ఉమాపుత్రాయ నమః బిల్వపత్రం పూజయామి.
గజాననాయ నమః దుర్వాయుగ్మం పూజయామి.
హరసూనవే నమః దత్తూర పత్రం పూజయామి.
లంబోదరాయ నమః బదరీ పత్రం పూజయామి.
గుహజాగ్రయ నమః అపామార్గ పత్రం పూజయామి.
గజకర్ణకాయ నమః తులసీ పత్రం పూజయామి.
ఏకదంతాయ నమః చూత పత్రం పూజయామి.
వికటాయ నమః కరవీర పూజయామి.
భిన్నదంతాయ నమః విష్ణుక్రాంత పత్రం పూజయామి.
వటవే నమః దాడిమీ పత్రం పూజయామి.
సర్వేశ్వరాయ నమః దేవదారు పత్రం పూజయామి.
ఫాలచంద్రాయ నమః మరువక పత్రం పూజయామి.
హేరంబాయ నమః సింధువార పత్రం పూజయామి.
శూర్పకర్ణాయ నమః జాజీపత్రం పూజయామి.
సురాగ్రజాయ నమః గండకీపత్రం పూజయామి.
ఇభవక్త్రాయ నమః శమీ పూజయామి.
వినాయకాయ నమః అశ్వత్థపత్రం పూజయామి.

## శ్రీ విఘ్నేశ్వర అష్టోత్తర శతనామావళిః

ఓం వినాయకాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం గౌరీపుత్రాయ నమః
ఓం గణేశ్వరాయ నమః
ఓం స్కందాగ్రజయా నమః
ఓం అవ్యయాయ నమః
ఓం పూతాయ నమః
ఓం దక్షాయ నమః
ఓం అధ్యక్షాయ నమః
ఓం ద్విజప్రియాయ నమః
ఓం అగ్నిగర్భచ్ఛిదే నమః
ఓం ఇంద్రశ్రీప్రదాయ నమః
ఓం వాణీప్రదాయ నమః
ఓం అవ్యయాయ నమః
ఓం సర్వసిద్ధిప్రదాయ నమః
ఓం శర్వతనయాయ నమః
ఓం శర్వరీప్రియాయ నమః
ఓం సర్వాత్మకాయ నమః
ఓం సృష్టికర్త్రే నమః
ఓం దేవాయ నమః
ఓం అనేకార్చితాయ నమః
ఓం శివాయ నమః
ఓం శుద్ధాయ నమః
ఓం బుద్ధిప్రదాయ నమః
ఓం శాంతాయ నమః
ఓం బ్రహ్మచారిణే నమః
ఓం గజాననాయ నమః
ఓం ద్వైమాత్రేయాయ నమః
ఓం మునిస్తుత్యాయ నమః
ఓం భక్తవిఘ్నవినాశనాయ నమః
ఓం ఏకదంతాయ నమః
ఓం చతుర్బాహవే నమః
ఓం చతురాయ నమః
ఓం శక్తిసంయుతాయ నమః
ఓం లమ్బోదరాయ నమః
ఓం శూర్పకర్ణాయ నమః
ఓం హరయే నమః
ఓం బ్రహ్మవిదుత్తమాయ నమః
ఓం కాలాయ నమః
ఓం గ్రహపతయే నమః
ఓం కామినే నమః
ఓం సోమసూర్యాగ్నిలోచనాయ నమః
ఓం పాశాంకుశధరాయ నమః
ఓం చండాయ నమః
ఓం గుణాతీతాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం అకల్మషాయ నమః
ఓం స్వయంసిద్ధాయ నమః
ఓం సిద్ధార్చితపదాంబుజాయ నమః
ఓం బీజపూరఫలాసక్తాయ నమః
ఓం వరదాయ నమః
ఓం శాశ్వతాయ నమః

ఓం కృతినే నమః
ఓం ద్విజప్రియాయ నమః
ఓం వీతభయాయ నమః
ఓం గదినే నమః
ఓం చక్రిణే నమః
ఓం ఇక్షుచాపధృతే నమః
ఓం శ్రీదాయ నమః
ఓం అజాయ నమః
ఓం ఉత్పలకరాయ నమః
ఓం శ్రీపతయే నమః
ఓం స్తుతిహర్షితాయ నమః
ఓం కులాద్రిభేత్త్రే నమః
ఓం జటిలాయ నమః
ఓం కలికల్మషనాశనాయనమః
ఓం చంద్రచూడామణయేనమః
ఓం కాంతాయ నమః
ఓం పాపహారిణే నమః
ఓం సమాహితాయ నమః
ఓం ఆశ్రిత శ్రీకరాయ నమః
ఓం సౌమ్యాయ నమః
ఓం భక్తవాంఛితదాయకాయనమః
ఓం శాంతాయ నమః
ఓం కైవల్యసుఖదాయ నమః
ఓం సచ్చిదానందవిగ్రహాయ నమః
ఓం జ్ఞానినే నమః
ఓం దయాయుతాయ నమః
ఓం దాంతాయ నమః
ఓం బ్రహ్మద్వేషవివర్జితాయ నమః
ఓం ప్రమత్తదైత్యభయదాయనమః
ఓం శ్రీకంఠాయ నమః
ఓం విబుధేశ్వరాయ నమః
ఓం రమార్చితాయ నమః
ఓం విధయే
ఓం నాగరాజయజ్ఞోపవీతవతే నమః
ఓం స్థూలకంఠాయ నమః
ఓం స్వయంకర్త్రే నమః
ఓం సామఘోషప్రియాయనమః
ఓం పరస్మై నమః
ఓం స్థూలతుండాయ నమః
ఓం అగ్రణ్యే నమః
ఓం ధీరాయ నమః
ఓం వాగీశాయ నమః
ఓం సిద్ధిదాయకాయ నమః
ఓం దూర్వాబిల్వప్రియాయ నమః
ఓం అవ్యక్తమూర్తయే నమః
ఓం అద్భుతమూర్తిమతే నమః
ఓంశైలేంద్రతనుజోత్సంగఖేలనోత్సుకమానసాయనమః
ఓం స్వలావణ్య సుధాసారజితే నమః
ఓం మన్మథ విగ్రహాయనమః
ఓం సమస్తజగదాధరాయనమః
ఓం మాయినే నమః
ఓం మూషకవాహనాయ నమః
ఓం హృష్టాయ నమః
ఓం తుష్టాయ నమః
ఓం ప్రసన్నాత్మనే నమః
ఓంసర్వసిద్ధిప్రదాయకాయనమః

## దుర్వాయుగ్మపూజ

గణాధిపాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
ఉమాపుత్రాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
అఖువాహనాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
ఈశపుత్రాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
సర్వసిద్ధిప్రదాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
ఇభవక్త్రాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
మూషికవాహనాయ నమః దుర్వాయుగ్మేన పూజయామి.
కుమార గురవే నమః దుర్వాయుగ్మేన పూజయామి.

## ధూపం

మం.ఓం యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్
ముఖం కిమస్య కౌ బాహూ కా వూరు పాదా వుచ్యేతే॥
శ్లో. లంబోదరం మహాకాయం ధూమ్రకేతో సువాసితం।
ధూపం గృహాణ దేవేశే సంకటం మే నివారయ॥
శ్రీ సంకష్ట హర గణపతయే నమః ధూపమాగ్రాపయామి.

## దీపం

మం.ఓం బ్రాహ్మణో౽స్య ముక మాసీత్। బాహూ రాజన్యః కృతః
ఊరు తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥
శ్లో. సర్వజ్ఞ సర్వలోకేశ త్రైలోక్య తిమిరాపహ।
గృహాణ మంగళం దీపం- రుద్రప్రియ నమో౽స్తుతే॥
శ్రీ సంకష్ట హర గణపతయే నమః ఫలోదక స్నానం సమర్పయామి.

## నైవేద్యం

మం.ఓం చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యో అజాయత।
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ। ప్రాణాద్వాయు రజాయత॥
శ్లో.నైవేద్యం గృహ్యాతాం దేవ భక్తింమే హ్యా చలాం కురు।
ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాం గతిమ్॥

ఓం భూర్భువస్సువ ః ! తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి ! దియో యోనః ప్రచోదయాత్! నైవేద్యముపై నీటిని చిలకరించి, పగటియందు సత్యం త్వర్తేన పరిషించామి !అని రాత్రి అయితే "ఋతంత్వా సత్యేన

పరిషించామి" అంటూ నైవేద్యము చుట్టూ నీళ్ళు త్రిప్పి, అమృతమస్తు అమృతో పస్తరణమసి స్వాహా ! ఓం ప్రాణాయస్వాహా ! ఓం అపానాయ స్వాహా ! ఓం వ్యానాయ స్వాహా ! ఓం ఉదానాయ స్వాహా ! ఓం సమానాయ స్వాహా ! ఓం బ్రహ్మణేస్వాహా! మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధానమసి. ఉత్తరాపోశనం సమర్పయామి. హస్తౌ ప్రక్షాళయామి. పాదౌ ప్రక్షాళయామి. ముఖే ఆచమనీయం సమర్పయామి.

## మోదక సమర్పణం

**శ్లో. ఏకవింశతి సంఖ్యాకాన్ మోదకాన్ ఘృతకాన్ ఘృతపాచితాన్।**
**నైవేద్యం సఫలం దద్యాం నమస్తే విఘ్ననాశినే॥**
**శ్రీ సంకష్ట హర గణపతయే నమః ఏకవింశతి మోదకాన్ సమర్పయామి.**
**(అనుచూ 21 కుడుములు సమర్పించాలి.)**

## కరోద్వర్తనం

**శ్లో. మలయాచల సంభూతం కర్పూరేణ సమన్వితం।**
**కరోద్వర్తనకం చారు గృహ్యతాం జగతః పతే ॥**
**శ్రీ సంకష్ట హర గణపతయే నమః కరోద్వర్తనార్థే చందనం సమర్పయామి.**

## తాంబూలం

మం. నాభ్యా ఆసీదంతరిక్షమ్। శిర్ష్ణో ద్యౌస్సమవర్తత।
పద్భ్యాం భూమిర్దశః శ్రోతాత్। తథా లోకాగ్ం అకల్పయన్॥
**శ్లో. పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం।**
**కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥**
**శ్రీ సంకష్ట హర గణపతయే నమః తాంబూలం సమర్పయామి.**

## దక్షిణ

**శ్లో. హిరణ్యగర్భ గర్భస్థం హేమ బీజం విభావసోః।**
**అనంత పుణ్య ఫలద మత శ్శాంతిం ప్రయచ్ఛ మే॥**
**శ్రీ సంకష్ట హర గణపతయే నమః సువర్ణ పుష్ప దక్షిణాం సమర్పయామి.**

## ఆభరణములు

**శ్లో. వజ్రమాణిక్య వైఢూర్య ముక్తా విద్రుమ మండితమ్।**
**పుష్పరాగ సమాయుక్తం భూషణం ప్రతిగృహ్యతామ్॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః సర్వాభరణాని సమర్పయామి.

## నీరాజనం

మం.వేదాహమేతం పురుషం మహంతమ్। ఆదిత్యవర్ణంతమసస్తుపారే।
సర్వాణి రూపాణి విచిత్య ధీరః। నామాని కృత్వాభివదన్యదాస్తే।

**శ్లో. ఘృతవర్తిసహస్రైశ్చ కర్పూరశకలైస్తదా।**
**నీరాజనం మయాదత్తం గృహాణ వరదోభవ॥**
**సమ్రాజంచ విరాజంచ అభిశ్రీః యాచనోగృహే**
**లక్ష్మీరాష్ట్రయాముఖే తయామా సగ్ం సృజామసి॥**
**సంతత శ్రీరస్తు। సమస్త సన్మంగళానిభవంతు।**
**నిత్య శ్రీరస్తు నిత్య మంగళానిభవంతు।**

శ్రీ సంకష్టహర గణపతయే నమః కర్పూర మంగళ నిరాజనం సమర్పయామి. (అనుచు గంట మ్రోగిస్తూ కర్పూర జ్యోతిని స్వామికి చూపి ఉద్ధరిణితో పళ్ళెంలో నీరును వదలిపెట్టాలి.)

## మంత్రపుష్పం

మం.ఓం యజ్ఞేన యజ్ఞ మయజంత దేవా స్తాని
ధర్మాణి ప్రథమాన్యాసన్.
తే హ నాకం మహిమానస్సచంత
యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవా॥

ఇక్కడ మంత్రపుష్పం పెద్దదికాని, చిన్నదికాని చెప్పవలెను. ఈ శ్లోకములు రానివారు ఈ శ్లోకాలలో మంత్రపుష్పాన్ని సమర్పించాలి)

**శ్లో. గణాధిప నమస్తేస్తు ఉమాపత్రా విఘ్ననాశన**
**వినాయకేశ తనయ సర్వసిద్ధి ప్రదాయక॥**
**ఏకదంతైక వదన తథా మూషికవాహన।**
**కుమారగురవే తుభ్యమర్పయామి సుమాంజలిమ్॥**
**తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి।**
**తన్నోదంతిః ప్రచోదయాత్॥**

శ్రీ సంకష్ట హర గణపతయే నమః మంత్రపుష్పాంజలిం సమర్పయామి. (అంటూ పుష్పములను దోసిలితో తీసుకుని స్వామి పాదాలపై సమర్పించాలి.

## ప్రదక్షిణం

మం. ఓం సప్తాస్యాసన్ పరిధయ స్త్రిసప్త సమిధః కృతాః।
దేవా యద్యజ్ఞం తన్వాన అబధ్నన్ పురుషం పశుమ్॥

శ్లో. విఘ్నేశ్వర విశాలక్ష సర్వాభీష్ట ఫలప్రద।
ప్రదక్షిణం కరోమి త్వాం సర్వాన్ కామాన్ ప్రయచ్ఛ మే॥

శ్రీ సంకష్ట హర గణపతయేనమః ఆత్మప్రదక్షిణ నమస్కారన్ సమర్ప యామి.

## ప్రార్థన

శ్లో. నమస్తుభ్యం గణేశాయ నమస్తే విఘ్ననాశన।
ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాంగతిమ్॥
వినాయక నమస్తుభ్యం సతతం మోదకప్రియ।
నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా॥
అపరాధ సహస్రాణి క్రియంతే అహర్నిశం
మయా పుత్రోయమితి మామత్వ క్షమస్వ గణనాయక॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సురేశ్వర।
యత్ పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్సు మే॥
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ।
తస్మాత్ కారుణ్య భావేన రక్షమాం పరమేశ్వర॥
రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి।
పుత్రాన్‌దేహి ధనందేహి సర్వాన్ కామాంశ్చ దేహిమే॥

శ్రీ సంకష్ట హర గణపతయే నమః ప్రార్థనా నమస్కారాన్ సమర్పయామి. అంటూ పుష్పములు, అక్షతలు స్వామివారి పాదములపై సమర్పించవలెను.

## పూజా సమాప్తి

శ్లో. యస్య స్మృత్యా చ నామోక్త్యా వ్రత పూజా క్రియాదిషు।
సర్వం సంపూర్ణతాం యాతి తం వందే గణనాయకమ్॥

అనేక యధాజ్ఞానేన యధాభక్త్యా సంభవద్భి ర్ద్రవ్యైః కృతేన పూజనేన శ్రీ సంకష్టహర గణపతిః ప్రియతామ్ సుప్రీత సుప్రసన్నో వరదోభవతుః సర్వం శ్రీ సంకష్టహర గణపతి చరణా రవిందార్పణమస్తు.

అంటూ అక్షతలను నీటితో పళ్ళెముతో విడిచిపెట్టాలి.

శ్రీ సంకష్ట గణపతికి సమర్పించిన మోదకములలో ఒకటి స్వామి వారి వద్దనే ఉంచి, 10 తాను ఉంచుకుని 10 వాయనముగా ఇవ్వవచ్చును.

## అర్ఘ్య ప్రదానము

శ్లో. గౌరిసుత నమస్తేస్తు సర్వసిద్ధి ప్రదాయక।
సర్వ సంకటనాశార్థం గృహాణార్ఘ్యం నమోస్తుతే॥

శ్రీ సంకష్ట హరగణపతయే నమః ప్రథమార్ఘ్యం సమర్పయామి.

శ్లో.విఘ్ననాశాయ దేవేశ విఘ్నరాజ నమామ్యహం।
త్వత్ప్రసాదేన సర్వాణి- కార్యాణి చ కరోమ్యహమ్॥

శ్రీ సంకష్ట హరగణపతయే నమః ద్వితీయార్ఘ్యం సమర్పయామి.

శ్లో.ఫాలచంద్ర నమస్తుభ్యం భక్తానాం భద్రదాయక।
గంధ పుష్పై ఫలైర్యుక్తం గృహాణార్ఘ్యం మయా ర్పితమ్॥

శ్రీ సంకష్ట హరగణపతయే నమః తృతీయార్ఘ్యం సమర్పయామి.

దోసిలితో నీరు పుష్పములు, గంధమును ఉంచుకుని స్వామికి చూపించి పళ్లెములో వదలాలి.

## చంద్ర ప్రార్థన

శ్లో.నమస్సోమాయ దేవాయ ద్విజరాజాయ పాలినే।
పాహిమాం కృపయా దేవ నక్షత్రేశ నమోస్తుతే॥

అని చంద్రుని ప్రార్థించి ఈ దిగువ మంత్రముతో చంద్రునకు రెండు అర్ఘ్యములను ఇవ్వవలెను.

## చంద్రార్ఘ్య ప్రదానము

శ్లో.క్షీరోదార్ణవ సంభూత అత్రినేత్ర సముద్భవ।
గృహాణార్ఘ్యం మయాదత్తం రోహిణ్యా సహిత ప్రభో।

శ్రీ రోహిణీ చంద్రమసే నమః ప్రథమార్ఘ్యం సమర్పయామి.

శ్లో.నమస్తే రోహిణీశాయ సుధారూప నిశాకర
గృహాణఅర్ఘ్యం మయాదత్తం రమానుజ నమోస్తుతే॥

శ్రీ రోహిణీ చంద్రమసే నమః నమః ద్వితీయార్ఘ్యం సమర్పయామి.

శ్లో. క్షీర సారసాగర సంభూత సుధారూపనిశాకర
గృహణార్ఘ్యం మయాదత్తం రోహిణ్యా ఏహిలోప్రభు
గృహాణఅర్ఘ్యం మయాదత్తం రమానుజ నమోస్తుతే॥

శ్రీ రోహిణీ చంద్రమసే నమః నమః తృతీయార్ఘ్యం సమర్పయామి.

ప్రతిమాదాన మంత్రములు

శ్లో. వినాయకస్య ప్రతిమాం వస్త్రయుగ్మేన వేష్టితాం।
తుభ్యం సం ప్రదదే విప్ర ప్రీయతాం మే గజాననః॥
గణేశః ప్రతి గృహ్ణాతి గణేశా వై దదాతి చ।
గణేశ స్తారకోభాభ్యాం గణేశాయ నమో నమః॥

అనేక ప్రతిమాదానేన శ్రీ సంకటహర గణపతిః ప్రియతాం ప్రీత స్సుప్రసన్నో వరదో భూత్వా మమ యావజ్జీవం సంకటాన్ వినివారయేత్.

ఉద్యాపన సమయములో గణేశ ప్రతిమను (మట్టి గణపతినిగాని, పగడ గణపతినిగాని, మరకత గణపతినిగాని చిన్నవి) పై మంత్రములతో బ్రాహ్మణునికి దక్షిణతాంబూలాదులతో సమర్పించాలి.

## శ్రీ గణేశ ప్రాతఃస్మరణమ్

ప్రాతఃస్మరామి గణనాథ మనాథ బంధుం ।
సింధూరపూర పరిశోభిత గండయుగ్మం।
ఉద్దండ విఘ్నపరిఖండన చండదండ।
మాఖండలాది సురనాయక బృందవంద్యమ్॥ 1
ప్రాతర్నమామి చతురానన వంద్యమాన।
మిచ్ఛానుకూల మఖిలం చ వరం దదానం।
తం తుందిల ద్విరస నాధిప యజ్ఞ సూత్రం ।
పుత్త్రం విలాస చతురం శివయోః శివాయ॥ 2
ప్రాత ర్భజా మ్యభయదం ఖలు భక్తశోక।
దావానలం గణవిభుం వర కుంజరాస్యం ।
అజ్ఞాన కానన వినాశన హవ్యవాహ।
ముత్సాహ వర్ధన మహం సుత మీశ్వరస్య॥ 3
శ్లోకత్రయ మిదం పుణ్యం సదా సామ్రాజ్యదాయకం।
ప్రాత రుత్థాయ సతతం యః పఠే త్ప్రయతః పుమాన్॥ 4

# సంకష్టహరచతుర్థీ
# శ్రీ మహాగణపతి వ్రతకథ

## అధ్యాయము - 1

శూరసేన మహారాజు యిలా అన్నాడు ఓ బ్రహ్మదేవా! పూర్వం యీ వ్రతాన్ని యెవరాచరించారు? దీనివలన యే ఫలం లభిస్తుంది? అన్నాడు. అప్పుడు బ్రహ్మ దేవుడిలా అన్నాడు. ఓరాజా! పరమేశ్వరాజ్ఞతో పార్వతీదేవి యీ వ్రతాన్ని నియమనిష్ఠచే ఆచరించింది. మహాఫలాన్ని పొందింది. అయిదు మాసాలు కుమారస్వామి ఈ వ్రతం గావించాడు. అలాగే అగస్త్య మహర్షి దీనిని గావించి సప్త సముద్రాలనూ ఆపోశనం పట్టాడు. మూడు నెలలచేసి విఘ్నేశ్వరుని ప్రసాదం పొందాడు. అలాగే నలచక్రవర్తిని యెడబాసిన దమయంతీ దేవి యీ పవిత్ర చతుర్థీ వ్రతాన్ని చేసి నలుని పొందింది. చిత్రలేఖ దీని ప్రభావంచేత రుక్మిణీదేవి తన పుత్రుడైన ప్రద్యుమ్న కుమారుని యెడబాసి పుత్రదుఃఖాన్ని భరింపరానిదయింది.

మన్మథుని మారు రూపాన్ని పొందిన ప్రద్యుమ్నుడు త్రిలోకైక సుందరుడు. ఆతనిని యెడబాసిన రుక్మిణీదేవి దుఃఖం ఇంతా అంతా అనరానిదిగా అనుభవిస్తుంది. తనతోటివారి పుత్రులను చూస్తూ రుక్మిణీదేవి కుమారుని వియోగ దుఃఖాన్ని భరింపలేక పోయింది. యిలా భరింపరాని బాధపడుతున్న ఆమెను చూడ్డానికి ఒకరోజు దైవయోగరీత్యా లోమశముని వచ్చాడు. ఆయనను సగౌరవ భక్తి వినయ సంభ్రమాలతో అర్ఘ్య పాద్యాలతో పూజించి ఉచితాసనముపై రుక్మిణీదేవి కూర్చుండబెట్టి ఆ దివ్యమహర్షికి తన పుత్ర వియోగ దుఃఖభారాన్ని వినిపించింది. "అమ్మా రుక్మిణీదేవీ! నీ దుఃఖ భార

మంతా నాకవగతమయింది. యీ పుత్ర వియోగం తొలగి సమాగమము కావాలన్న "సంకష్ట చతుర్థీ వ్రతం" నీవాచరించాలి. దాని ప్రభావము వలన నీ కుమారుడు శంబరాసురుని వధించి నీకు లభిస్తాడు అని చెప్పాడు. అప్పుడు రుక్మిణీదేవి యీ సంకష్ట చతుర్థీ వ్రతం ఆచరించింది.

బాణాసురుని సోణపురంలో బంధింపబడ్డ అనిరుద్ధ కుమారుడు కూడా యీ వ్రత ప్రభావము వలనే ఆ రాక్షసుని కుమార్తెను వివాహం గావించుకొని మరీ ఆ రక్కసుని జయించి, శ్రీకృష్ణపరమాత్మను తన తండ్రిని కలిశాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఆ మహారాజుకు యిలా చెప్పాడని సూతుడు శౌనకాది మునులకు యీ కథను తెలుపుచున్నాడు.

ఓ రాజా! నా సృష్టి నానా రకాలతో అనేక గందర గోళాలతో కూడి ఉంటుందని నీకు చెప్పనక్కరలేదు. దేవ, దానవ, నర, కిన్నెర, కింపురుష ఉరగాదు లందరూ ఉన్నారు. వీరందరకూ ఆపదలు సంభవిస్తాయి. అలాంటి సమయాల్లో సర్వాపదలనూ నివారణ గావించే యీ వ్రతాన్ని వారాచరిస్తే తప్పక వారికి చిత్తశాంతి లభించి ఆపదలన్నీ అంతమవుతాయి. సర్వసిద్ధులూ లభిస్తాయి. ఆయురారోగ్యాదులతో పుత్రకళత్ర పౌత్రాదులతో వారుంటారు. దానాలు గాని, తపస్సుగాని, యజ్ఞయాగాదులు గాని యీ వ్రతంతో సరికావు. ముందు మహాగణపతిని ఆవాహనగావించి యీ వ్రతాన్ని ఆచరించాలి.

యీ వ్రతకథను సర్వ బంధువులూ, మిత్రులూ, ఆప్తులనూ పిలిచి వినాలి. అందరితో వ్రతాంతమందు దేవికి మహానైవేద్యం నివేదించి మంగళ హారతి యిచ్చి అనంతరం ప్రసాదాన్ని అందరకూ భక్తితో యిచ్చి వ్రతమాచరించే వారు సేవించాలి. నాస్తికులుగాని,

ఆస్తికులుగాని శఠులు, పాషండులు యెవరైనా యీ వ్రతాన్ని ఆచరిస్తే వారందరూ సర్వశుభాలందుతారు. గురు వులూ, శిష్యులు, పుత్రులూ, మిత్రులూ అందరూ యీ వ్రతమాచరింప వచ్చును సుమా ! రాజేంద్రా? యిలా ఆ మహారాజు రాజ్యాన్ని బాసియున్న ఆతడు బ్రహ్మదేవుని వలన విని యీ సంకష్ట చతుర్థీ వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో ఆచరించి తన పుత్ర మిత్ర కళత్రాదులతో సహా రాజ్యాన్ని పొంది హాయిగా ఉన్నాడని సూతమహర్షి శౌనకాదులకు యీ మహావ్రత విధానాన్ని విన్పించ వారందరెంతో ఆనందాన్ని పొందారు.

## అధ్యాయము - 2

తరువాత బ్రహ్మదేవుడిలా చెప్పాడు. మొదటి నెలలో వచ్చే పంచమీ, సప్తమి తిథులందు యీ వ్రత ఉద్యాపనం జరపాలి. ఈ వ్రతాన్ని గావించా లని మనసు కల మనిషికి ముఖ్యంగా భక్తికావాలి. పూజా ద్రవ్యాలన్నీ సమ కూర్చుకొని మంచి మనస్సుతో పుష్ప మంటపం ఏర్పాటు గావించుకొనాలి. అచ్చట రకరకాల చిత్రాలతో రంగులతోగల వస్త్రాన్ని పరచాలి. రంగవల్లు లతో రంగులతో ఆ మంటపాన్ని అలంకారాన్ని గావించాలి. కలశస్థాపన చేయాలి. చందనాది సుగంధాలు, నానారకాల పరిమళములు గల పుష్పాలు టెంకాయలు, అప్పుడు లభించే ఫలాలూ, అర్ఘ్యపాద్యాలు అన్నీ సమకూర్చు కోవాలి.

"ఓం సంకష్టదేవీ ! ఈ మంచితిథిలో నీ వ్రతాన్ని ఆచరిస్తు న్నాం. మా గృహమంతా నీ పూజామందిరంగా చేసికో. నీకు మా సహస్ర వందనలర్పించు చున్నాం. అర్ఘ్యపాద్యాదులు మేము సమర్పించినవి నీవు ప్రీతిపూర్వకంగా స్వీకరింపుము. హే! విఘ్నేశ్వర! లంబోదర! మోదకప్రియా ! నీకు మా మనః పుష్పాలను సమర్పిం చాము. పాల సముద్రములో జన్మించినవాడా! అత్రి మహర్షి గోత్ర

